ఈకవి చిన్ననాఁటనే పితృవియోగము నంది మాతామహుఁడు కాకరపర్తి వేంకటశాస్త్రియొద్ద సంస్కృత మభ్యసించెను. ఇతని మేనమామలలో పాత్రిసూరి యనునతఁడు "సత్యభామాకృష్ణ సంవాదము" అను నందమైన ప్రబంధము రచించెను.

ఈ వేంకటకవి మండపాక పార్వతీశ్వరకవి, కాకర్పర్తి పాత్రిసూరి కవులకు సమకాలికుఁ డగుట చేత నితఁడు శతాబ్దిపూర్వార్ధములోనివాఁడని తెలియవలయును. ఈయన "తత్త్వసంగ్రహరామాయణము" రచించుచుండుటఁ దెలిసి సాలూరు జమీందారును, కాశింకోట జమీందారును కృతినిమ్మని కోరిరఁట. నరకృతిగావింప నిష్టపడక తద్గ్రంథము శ్రీకృష్ణభగవదంకితము గావించి యీకవి చరితార్థుఁ డయ్యెను. ఇందలి కవిత సంస్కృతపద ప్రచురము. వ్యాకరణవిశేషము లిక్కవి యెఱుంగు ననుట కనేక నిదర్శనము లున్నవి.

క. ఏహి గృహాణ పతిభిక్షాం
దేహి దయాక్షీరవారిధే నస్త్రాహి
త్రాహి రవిజం భటం జా
నీహి జహీహి క్రుధాం మనీషా శాంత్యా.

ఇది శుద్ధసంస్కృతకందము. ఇట్టివింకను గలవు. గ్రంథకర్త స్యాలకుఁడు వఝ్ఝల అన్నయభట్టు ఈగ్రంథము కొంతభాగము పూరించెను.

గీ. స్యాలకుఁడు మాకు సాహితీపాలకుండు
వఝ్ఝ లన్నయభట్టు కవనవిశేష
తులిత నన్నయభ ట్టురుబలసహాయు
మొనరఁ జేయఁగ నీగ్రంథమును రచింతు

అని కవి చెప్పుకొని, బాలకాండము మొదలు సుందరకాండాంతము - యుద్ధకాండములోఁ గుంభకర్ణ యుద్ధాంతముగను - తరువాత రావణ ద్వితీయ యుద్ధభాగము సీతాపరిగ్రహణ పట్టాభిషేక ఘట్టము వ్రాసి

పూర్తిచేసెను. నడుమది పర్షుల అన్నయ భట్టు ఎనుబదిపద్యములలోఁ బూరించెను. పూరణశైలి వేఱుగా నున్నది. వార్ధకభీతిచే నీకవి యితరునిచే వ్రాయించెనా ? యని సందేహించెదము. షష్టిపూర్తి కాకుండఁగనే యితఁడు మరణించెననియు, గ్రంథరచనమునకుఁ బదునైదేండ్లు పట్టెననియుఁ దద్వంశీయులు చెప్పుదురు.

ఈ రామాయణమేగాక వేంకటకవి మూఁడుశతకములు కూడ రచించెను. "రామా" అనునది యొకటియు, "నారాయణ ! భక్తపోషణా ! శ్రీరమణా !" అనున దొకటియు, "రామప్రభూ" అనున దొకటియు నా శతకములకు మకుటములు. ఈ రామాయణములో నాయా శతకపద్యములు శ్రీరామస్తవ సందర్భమునఁ గలవు. మచ్చునకందలి పద్య మొకటి ప్రకటించెదను.

అఘనాశాఖిల దేవతానిచయ సౌఖ్యప్రాపకోద్యత్ప్రభా
పఘనా ! దివ్యసువర్ణ చేలమణి భాస్వత్కాంచి కాంచన్మహా
జఘనా ! హార కిరీట ముఖ్యవర భూషాభూషిత ప్రోజ్జ్వలా
పఘనా ! కీర్తిఘనా ! ఘనాఘన సమాభాధామ ! రామప్రభూ !

# పరవస్తు వేంకట రంగాచార్యులు

## 1822 - 1900

వైష్ణవులు - జననము 1822సం. నిర్యాణము 1900 సం. నివాస స్థానము విశాఖపట్టణము. తండ్రి: శ్రీనివాసాచార్యులు, గ్రంథములు: ౧. మంజుల నైషధము (ఏడంకముల నాటకము) ౨. లఘువ్యాకరణము (శ్లోకరూపమగు సులభవ్యాకరణము) ౩. ప్రపత్తివాదము (వేదాంత గ్రంథము) ౪. కుంభకర్ణ విజయము ౫. ఆంగ్లాధిరాజ్యస్వాగతము (చిన్న కావ్యములు) ౬. శకుంతలము (ఆంధ్రీకరణము) ౭. కమలినీ కలహంసము (రాజచూడామణిదీక్షితుని కృతి కాంధ్ర పరివర్తనము) ౮. శబ్దార్థసర్వస్వము (నిఘంటువు) ౯. ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండ, మాండూక్యాది దశోపనిషత్తులకు నాంధ్రానువాదము, మున్నగునవి.

ప్రాచీనకవి పండితుల నిరంకుశతకు గుఱుతులుగా ననేక చరిత్రములు చెప్పుకొందురు. పిఠాపురసంస్థాన ప్రభువగు గంగాధర రామారావుగారు గొప్ప రసిక ప్రభువులనియు, వారియాస్థానిలో బులుసు పాపయ్యశాస్త్రి ప్రభృతులు పండితులుగానుండి చేసిన నిరంకుశవాదములు స్మరణీయములనియు నేడు కథలుగా, గాథలుగా నల్లుకొన్నవి. విజయనగర సంస్థానములో కలిగొట్టు కామరాజుగారని గొప్ప గాయకుడు. ఆయన పల్లవిపాటలో జోడు లేనివాఁడు. మహారాజు బతిమాలినను, దనకుఁ దోఁచినపుడుగాని గొంతెత్తువాఁడు కాదఁట.

మహామహోపాధ్యాయులగు పరవస్తు రంగాచార్యుల వారిని దర్శింప వలయునని విజయనగర సంస్థాన ప్రభువు నభిలాష. ఎన్నో సారులు వర్తమానము లంపిరి. చివరకు రంగాచార్యులవారు మూడు నియమముల కడ్డు చెప్పనిచో వచ్చుట కభ్యంతరము లేదని కబురు చేసిరి. ౧. సవారీలో కోటగుమ్మమువరకు వెళ్ళుట ౨. కోట గుమ్మముకడ సవారీ దిగి పాదుకలతో సభామండపముదాక వెళ్ళుట

(3) అక్కడ పాదుకలువదలి సభలో శిరఃశాసనముమీఁదఁ గూర్చుం
డుట. పయి షరతులలో మొదటి రెండును మహారాజున కంగీకార్యము
లైనవి. చివరిది మాత్రము నాకంగీకరింపఁ లేదు. "శిరశ్శాసనముమీఁద
గూరుచుండుట సామాన్యేకమియు వ్యక్తి రేఖము కాదు కాని, పండితుల కవ
మానకరము" అని ప్రభువుల యుద్దేశము. ఆపద్ధతిని మేము రానే
రామని రంగాచార్యులవారి సమాధానము.

ఇట్టి యాచార్యులవారి పాండితీ ప్రతిష్ఠ యెంతగొప్పదో! ఆయన
తర్క వ్యాకరణ మీమాంసా ద్యనేక శాస్త్రములలో నందెవేసినచేయి.
మహా మహోపాధ్యాయ బిరుదమును దిప మన తెలుఁగువారిలోఁ
బ్రథములు రంగాచార్యులవారు. వీరితరువాత తాతా సుబ్బారాయ
శాస్త్రిగారికే యాబిరుదు మన్నికెక్కి యనుగ్రహించినది. పదపడి, దాని
లోని బిగువు కొంత సడలిపోయి బెళుకు తగ్గినది. శాస్త్రములలో
నింత పరిశ్రమ చేయువారు, కవిత్వము చెప్పఁగలవారు వేయుదురు.
వీరటులు కారు. వారి యభిజ్ఞాన శాకుంతలము ౧౮౭౭ లో దెనుఁగున సంత
రించి 'సకల విద్యాభివర్ధని పత్రిక' లో రెండంకములు వెలువరించిరి.
మిగిలిన గ్రంథము ప్రచురితమైనట్లు చూడలేదు. రంగాచార్యులవారి
యీ తెలిఁగింపు శ్రీ కళింగము పంతులు గారి శాకుంతలాంధ్రీకృతికిఁ
గొంతయుత్సాహమిచ్చెనని స్వీయ చరిత్రములోని పంతులుగారి
వ్రాఁత వలనఁ దెలియును.

ఎంతటి కఠినాంశ మయినను జేతి యుసిరికవలె నందఁజేయు చాతు
ర్యము రంగాచార్యులవారికి నిసర్గజము. ఆయన మాటాడునపుడు
జనులు ముగ్ధులగుచుండెడివారు. సభ్యుల యభిరుచులు కని పెట్టి,
యిట్టే తదభిప్రాయములు గ్రహించుకొని యుపన్యసించుటలో వీరి
కున్నంత నేరుపు నేటివారికి నుండదని పలువు రిప్పటికిఁ జెప్పుకొనుట
కలదు. ౧౮౮౯ లో వీరొకతూరి రాజమహేంద్రవరము వేంచేసినపుడు

జరిగినముచ్చట శ్రీ వీరేశలింగము పంతులుగారు ముచ్చటించిరి. హిందూమత ప్రశస్తతనుగూర్చి రంగాచార్యులవారు సుధా సహోదరమగు మధురధోరణిలో నుపన్యసించెను. వెనువెంటనే మహారాష్ట్ర పాఠశాల స్థాపించి నడపుచుండిన గుత్తుస్వామిశాస్త్రి భావోద్రేకత నాపలేక "తానదివఱకు క్రైస్తవ మతావలంబియయ్యు మీ యనుగ్రహము వలన నేటినుండి హైందవ మతావలంబి నయితిననియు" జెప్పి ప్రణమిల్లెనంట. ఆయనకే కాదు, నాడు వీరియుపన్యాసము విన్న పరమతస్థుల మనస్సులెన్నో హిందూమతమువైపునకు వచ్చి స్థిరపడినవి. వాదవిషయమునఁ గొంత స్వాతంత్ర్యము చూపినట్లున్నను, మొత్తము మీఁద శాస్త్రప్రామాణ్యమునకు భంగము రానీయని రంగాచార్యుల వారు తీసినారని యనేకుల యభిప్రాయము.

వీరు తమ యెనిమిదవయేటనే కుంభకర్ణవిజయ మను సంస్కృత కావ్యము రచించిరి. ప్రౌఢ భాషాసరస్వతి బిరుదాఢ్యులై ౧౮౮౭ లో విక్టోరియా జూబిలిలో మహామహోపాధ్యాయులై పన్నె గాంచిన రంగాచార్యులవారు బొబ్బిలి, ఉర్లాము, పిఠాపురము, మైసూరు, మందసా మున్నగు సంస్థానములలో సన్మానింపఁబడిరి. బొబ్బిలి సంస్థానమున మూఁడు వందల ప్రచ్ఛకులతో బరశ్శతావధానము గావించిరని ప్రసిద్ధి.

ఆంగ్లములోని "ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా" గ్రంథము తీరు నాదర్శముగాఁ గొని శబ్దార్థ సర్వస్వమను గొప్పనిఘంటువును వీరు రచించినారు. ఇది వీరి సారస్వతోద్యమములలో శిరోమణి. దీని రచనకు మొత్తము నలువదియేండ్లు పట్టినది. 200 పుటలలో అకార-ఆకారాది పదములు గల రెండు సంపుటములు వెలువరింపఁబడినవి. శేషభాగ మెంతియో వెలుఁగు చూడవలసి యున్నదై యున్నది. మొదటి సంపుటములు చూచినచో శ్రీ రంగాచార్యుల వారి విశ్వతోముఖపాండిత్య మందు రూపముగట్టి కనుపట్టును. వీరి తండ్రిగారు శ్రీనివాసాచార్యులు "సర్వశబ్దసంబోధిని" యను అకారాది సంస్కృత

నిఘంటువు రచించిరి. అదిగాక వీరు వేంకటాధ్వరి 'విశ్వగుణాదర్శము' తెలుఁగు పఱిచిరి. కుమారుఁడు తండ్రిని మించిన పండితుఁడు.

ఈశావాస్యోపనిషత్తులకుఁ దెలుఁగు పద్యములలో ననువాదము రంగాచార్యులు గావించిరి. అది మూలాని కబ్బురమగును. ఆపద్యముల పొందిక సుందరమైనది.

శాన్తి॥ పూర్ణమదః, పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే॥

క. పూర్ణమది, పూర్ణమిదియుం
బూర్ణంబగు దానివలనఁ బూర్ణము పొడమున్
బూర్ణమునకు దానిఁ దీయఁగ
పూర్ణముఁ గొని మిగులుచుండుఁ బూర్ణమె యెంచన్.

శాన్తి॥ అప్యాయన్తు మమాంగాని, వాక్ప్రాణశ్చక్షుశ్శ్రోత్ర
మథో బలమింద్రియాణి చ సర్వాణి, సర్వం బ్రహ్మోపనిషదం,
మాహం బ్రహ్మ నిరాకుర్యాం, మా మా బ్రహ్మ నిరాకరోత్,
దనిరాకరణ మస్త్వనిరాకరణం మే అస్తు, తదాత్మని నిరతేయ
ఉపనిషత్సు ధర్మాస్తే మయి సన్తు తే మయి సన్తు॥

సీ. ఆప్యాయితములు నా యంగంబులగుఁ గాత,
ప్రాణంబు వాక్కు నేత్రంబు చెవియు
బల ముఖేంద్రియంబులు నట్లయగుఁ గాత
నిఖిలంబు బ్రహ్మోపనిషదమె యగు
బ్రహ్మంబు నేను నిరాకరింపఁగరాదు
బ్రహ్మంబు నన్ను నిరాకరింప
రా, దెందును నిరాకరణము గాకుండుఁగా
వుత, లేకయుండుఁ గావుత మదీయ
గీ. మఱి నిరాకరణంబును, నాత్మనిరత
మైన చోటున నుపనిషద్వ్యాహృతంబు

జరిగినముచ్చట శ్రీ వీరేశలింగము పంతులుగారు ముచ్చటించిరి. హిందూమత ప్రశస్తతనుగూర్చి రంగాచార్యులవారు సుధా సహోదర మగు మధురధోరణిలో నుపన్యసించెను. వెనువెంటనే మహారాష్ట్ర పాఠశాల స్థాపించి నడపుచుండిన గూత్తుస్వామిశాస్త్రి భావోద్రేకత నాపలేక "తానదివఱకు క్రైస్తవ మతావలంబిననియు మీ యనుగ్ర హము వలన నేఁటినుండి హైందవ మతావలంబి నగుచున్నాననియుఁ" జెప్పి ప్రణమిల్లెనఁట. ఆయనకే కాదు, నాఁడు వీరియుపన్యాసము విన్న పర మతస్థుల మనస్సులెన్నో హిందూమతమువైపునకు వచ్చి స్థిరపడినవి. వాదవిషయమునఁ గొంత స్వతంత్రత చూపినట్లున్నను, మొత్తము మీఁద శాస్త్రప్రామాణ్యమునకు నవ్వుగాని [illegible] రంగాచార్యుల వారు తీసినారని యనేకుల యభిప్రాయము.

వీరు తమ యెనిమిదవయేఁటనే కుంభకర్ణవిజయము నను సంస్కృత కావ్యము రచించిరి. ప్రౌఢభాషాసరస్వతి బిరుదాఢ్యులై ౧౮౮౭ లో విక్టోరియా జూబిలిలో మహామహోపాధ్యాయులై పన్నె గాంచిన రంగాచార్యులవారు బొబ్బిలి, ఉర్లాము, పిఠాపురము, మైసూరు, మందసా మున్నగు సంస్థానములలో సన్మానింపఁబడిరి. బొబ్బిలి సంస్థానమున మూఁడు వందల ప్రుచ్ఛకులతోఁ బరశ్శతావధానము గావించిరనిప్రసిద్ధి.

ఆంగ్లములోని "ఎన్సైక్లోపీడియా బ్రిటానికా" గ్రంథము తీరు నాదర్శముగాఁ గొని శబ్దార్థ సర్వస్వమను గొప్పనిఘంటువును వీరు రచించినారు. ఇది వీరి సారస్వతోద్యమములలో శిరోమణి. దీని రచనకు మొత్తము నలువదియేండ్లు పట్టినది. 200 పుటలలో అకార-ఆకారాది పదములు గల రెండు సంపుటములు వెలువరింపఁబడినవి. శేషభాగ మెంతియో వెలుఁగు చూడవలసి యున్నదై యున్నది. మొదటి సంపుటములు చూచినచో శ్రీ రంగాచార్యుల వారి విశ్వతో ముఖపాండిత్య మందు రూపముగట్టి కనుపట్టును. వీరి తండ్రిగారు శ్రీనివాసాచార్యులు "సర్వశబ్దసంబోధని" యను అకారాది సంస్కృత

నిఘంటువు రచించిరి. అదిగాక వారు వేంకటాధ్వరి 'విశ్వగుణాదర్శము' తెలుఁగు పఱచిరి. కుమారుఁడు తండ్రిని మించిన పండితుఁడు.

ఈశావాస్యోపనిషత్తులకుఁ దెలుఁగు పద్యములలో ననువాదము రంగాచార్యులు గావించిరి. అది మాకు నబ్బురమగును. ఆపద్యముల పొందిక సుందరమైనది.

శాన్తిః॥ పూర్ణమదః, పూర్ణమిదం, పూర్ణాత్పూర్ణ ముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే॥

క. పూర్ణ మది, పూర్ణ మిదియుం
బూర్ణంబగు దానివలనఁ బూర్ణము పొడమున్
బూర్ణమునగు దానిదే యగు
పూర్ణముఁ గొను మిగులుచుండుఁ బూర్ణమె యెందున్.

శాన్తిః॥ ఆప్యాయన్తు మమాఙ్గాని, వాక్ప్రాణశ్చక్షుశ్శ్రోత్ర
మథో బలమిన్ద్రియాణి చ సర్వాణి, సర్వం బ్రహ్మౌపనిషదం,
మాఽహం బ్రహ్మ నిరాకుర్యాం, మా మా బ్రహ్మ నిరాకరోత్,
దనిరాకరణమస్త్వనిరాకరణం మే అస్తు, తదాత్మని నిరతేయ
ఉపనిషత్సు ధర్మాస్తే మయి సన్తు తే మయి సన్తు॥

సీ. ఆప్యాయితములు నాయంగంబు లగుఁ గాత,
ప్రాణంబు వాక్కు నేత్రంబు చెవియు
బల ముఖ్యేంద్రియంబులు నట్లయగుఁ గాత
నిఖిలంబు బ్రహ్మోపనిషదమె యగు
బ్రహ్మంబు నేను నిరాకరింపఁగరాదు
బ్రహ్మంబు నన్ను నిరాకరింప
రా, దెందును నిరాకరణము కాకుండుఁగా
వుత, లేకయుండుఁ గావుత మదీయ

గీ. మగు నిరాకరణంబును, నాత్మనిరత
మైన చోటున నుపనిషద్వ్యాహృతంబు

తైన ధర్మంబు లెల్ల నాయందు నెప్పు
కలుగుఁ గాత, నాయందు నవి కలుగుఁ గాత !

శాన్తిః॥ భద్రం కర్ణేభి శ్శృణుయామ దేవాః । భద్రం పశ్యే మాక్షభి
ర్యజత్రాః । స్థిరై రఙ్గైస్తుష్టువాగ్ం సస్తనూభిః । వ్యశేమ
దేవహితం యదాయుః । స్వస్తి న ఇన్ద్రో వృద్ధశ్రవాః ।
స్వస్తి నః పూషా విశ్వవేదాః । స్వస్తి నస్తార్క్ష్యో అరిష్ట
నేమిః । స్వస్తి నో బృహస్పతి ర్దధాతు ॥

ఉ. విందుముగాత మా చెవుల వేల్పులార శుభంబు లెప్పుడుం
గందుముగాత భద్రములె కన్నుల నో యజనీయులార! మె
ప్పుం దిరమైన యంగముల బొందిమ నిన్ను నుతించువారమై
యుందుముగాత, ఆయు విగవొందఁగ మేనుల నిల్చు నింపుగన్.

ఆ. వె. ఇంద్రుఁడిచ్చు మేలు వృద్ధశ్రవుఁడు విశ్వ
వేదుఁడైన పూష విభుఁడు నట్ల
తా నరిష్టనేమి తార్క్ష్యుండు మాకు బృ
హస్పతియును శుభదు లగుదు రలమి.

శాన్తిః॥ సహనా వవతు । సహనౌ భునక్తు ।
సహవీర్యం కరవావహై । తేజస్వినా వధీత మస్తు
మా విద్విషావహై । ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ॥

చం. మనల నతండు ప్రోచుత సమంబుగఁ, బాలన సేయుఁగావుతన్
మనమును వీర్యమొక్క మొగిమానక చేతుముగాత, మెప్పుడున్
మనదగునీయధీతమును. మానిత తేజము గాత, ద్వేషమున్
మనకెప్పుడుం దొలంగుత, శమంబు శమంబు శమంబుగావుతన్!

# నరసింహదేవర వేంకటశాస్త్రి

## 1828 - 1915

ఆరామద్రావిడశాఖీయబ్రాహ్మణుడు. ఆపస్తంబ సూత్రుడు. శ్రీవత్స గోత్రుడు. తల్లి: సీతమాంబ. తండ్రి: ఉమామహేశ్వర శాస్త్రి. జన్మస్థానము: తాడేపల్లిగూడెము. నివాసము: తణుకుతాలూకా [illegible]. జననము 1828- సర్వజిన్నామసంవత్సర కార్తిక శుద్ధ ద్వితీయ. విశాఖ నక్షత్ర చతుర్థచరణము. నిర్యాణము : 1915 రాక్షసనామ సంవత్సర శ్రావణబహుళ పంచమి. గ్రంథములు : ౧. వేంకటేశ్వర శతకము ౨. గౌరీశతకము 3. విచిత్రరామాయణము.

ఇరువదియేండ్లు వచ్చువఱకును వేంకటశాస్త్రిగారు పండితులుగాదు కవియును గాదు. అష్టపదులు తరంగములు కృతులు మృత్యుంజయ విలాసము అధ్యాత్మరామాయణ కీర్తనలు చెప్పుకొని పాడుకొనునొక భక్తుడు. దానికిదోడు డాయినమ్మసంగముకూడ జక్కగ వాయించుచుండువారు. వెలగదుర్రు గ్రామమునకు సభాపతియై పెత్తనము నిర్వహించుచుండెను. అట్టిసమయమున నెవరో యొక శాస్త్రులుగారు వచ్చి మన వేంకటశాస్త్రిగారితో సంస్కృతమున మాటాడ నారంభించిరట. వీరి కాభాష బొత్తిగా రాదు. దానితో నభిమానము పుట్టి నాడు మొదలు వేంకటశాస్త్రిగారు సంస్కృతాంధ్ర భాషలు పట్టుదలతో సాధించిరి. ఇరువదియేట రచించిన వేంకటేశ్వర శతకము వీరి తొలికబ్బము. తరువాత 'గౌరీశతకము' రచించిరి. ముప్పదవయేట 'విచిత్రరామాయణము' రచించుట కారంభించి మూడేండ్లలో నాలుకాండములును బూర్తిచేసిరి. ఇది శ్రీరామాంకితము. ఈ కవివరుని కీర్తిని శాశ్వత మొనరించునది యీ యొక్క కావ్యమే.

గోపీనాథకవి వచనమున నీవిచిత్రరామాయణము తొలుత రచించెను. అదిచూచి గద్యపద్యకావ్యముగా వేంకటశాస్త్రిగారిది వ్రాసిరి. ఇందు లాక్షణికు లంగీకరింపని ప్రయోగములు కొన్ని యున్నను కవి

త్వము మాత్రము ధారాశుద్ధి. ఆనాఁడు పెద్దపండితులైన కొక్కొండ వేంకటరత్న శర్మ, బహుజనపల్లి సీతారామాచార్యులు గ్రంథము మీఁద మంచి యభిప్రాయములిచ్చిరి. "...దండి కావ్యము కంటెను అభినవ దండికావ్యముకంటెను జాలమేలని యెన్నఁదగియున్నది" అని వేంకటరత్నశర్మగారును, "... ఆధునిక గ్రంథస్థములని తెలియకయుండలి గద్యపద్యములను విన్నవారు అవి పూర్వగ్రంథస్థములే యని సందేహముగఁ దలంతురు" అని సీతారామాచార్యులుగారును విచిత్ర రామాయణమును కొండాడిరి. ఇందలి కవిత్వపు మచ్చునకు రెండుపద్యములు:

గుంపులుగూడి సీత సునకు స్నానసివ్వను గాలి బన్నీరుల్
సొంపవు శ్రీకసీల మణిసోయగము న్వహించి యున్న వి
చంపకగంధి మోముజిగి చందురు తేటకు సాటిరాఁగనున్
దంపతులేమి నోఁచిరొకొ తథ్యము గబ్బితెముందురం తునున్.
లలితేందీవరకైరవాకృతిజ కల్హారాదిపుష్పాళి సం
చలదిందిందిర బృందగానలహరీ సంయుక్తమంద ప్రభా
నిలసంచారకృతార్భటోర్మియుత పానీయాఘముంగల్గి ని
ర్మలమై యొప్పు సరోవరంబుగని తా హ్లాదప్రతీకాలుకై వైనాల్.

శాస్త్రిగారు తమ ౭౮ వ యేఁట విచిత్రరామాయణమున నుత్తర కాండము సంపూర్తిపఱిచి ఎంతో ముద్రింపించుకొనిరి. తరువాత వారి కుమారులు ౧౯౩౭ లో నీగ్రంథము సమగ్రముగ వెలువఱిచిరి.

ఈ కావ్యముగాక మనకవి 'విరాగసుమతీసంవాద' మను వేదాంతపర మగు హరికథను వ్రాసెను. వీరికి నాగబంధ, రథబంధాదులరచనయందు మంచినేర్పు కలదు. గానకళలోఁ జక్కని ప్రవేశము కలదు. ముహూర్త భాగమునఁ బెద్దయనుభవము కలదు. ఈయన యెట్టికవియో యట్టి నైష్ఠికుఁడు. ఏకాదశీవ్రతము విడిచియెఱుఁగఁడు. ఇట్టి భక్తకవి నోటి నుండి వచ్చిన 'విచిత్ర రామాయణము' తెలుఁగుబాసకుఁ దొడవగుట కాశ్చర్యమేమి!

# రేమెల వేంకటరాయ కవి

## 1820-1847

గోదావరి మండలములోని 'దుగ్గుదుఱ్ఱు' గ్రామ నివాసి, వెలమకుల సంభవుండు. అరవెల్లిగోత్రీయుండు. తండ్రి: భూపయ. జననము 1820 ప్రాంతమున. నిర్యాణము 1847 ప్రాంతమున. రచితగ్రంథము: ఉత్తరా పరిణయము.

ఈకవి వెలమకులీనుండు. 'ఉత్తరాపరిణయ' మను మూఁడాశ్వాసముల ప్రౌఢప్రబంధము రచించెను. నివాసము కాకినాడ తాలూకాలోని దుగ్గుదుఱ్ఱు. దానికి రెండుమైళ్ల దూరమున 'వర్యోయు' అను పల్లెటూరు కలదు. అది సుప్రసిద్ధ పండితకవియగు పిండిప్రోలు లక్ష్మణకవి పుట్టినయూరు. లక్ష్మణకవికిని వెంకటరాయకవికిని పరస్పర పరిచయమున్నట్లు తత్రత్యులు చెప్పుదురు. ప్రకృతకవి యిరువది యేడేండ్లు మాత్రమే జీవించియున్నట్లు పరంపరాయాత ప్రసిద్ధి.

శ్రీమించన్ ధర సద్గుణావళులచేఁ జెన్నొందుచున్నట్టి యా
శ్రీమద్వేంకటనీలశైలపతి వాసింజూచి పోషింపఁగా
ధీమద్రాజితదుగ్గుదుర్తిపురి నాత్రేయాసమాలోకనో
ద్దామత్వంబున నుంటి మెచ్చుట సదాధర్మార్జనవ్యాప్తిచే.

అని వ్రాసికొనుటంబట్టి శ్రీ పీఠికాపురప్రభువగు శ్రీరావు వేంకట నీలాద్రిరాయనింగారి యాదరణమునకుఁ బాత్రుఁడయ్యె ననివ్యక్తము. ఈకవి జ్యోతిషమున మంచిప్రజ్ఞావంతుఁడఁట. జాతకమునుబట్టి తానిరువదియేడేండ్ల వయసున మరణింతునని తెలిసికొని పెండ్లిగావించుకొనక గ్రంథరచనాదీక్షితుఁడై శ్రీరామచంద్రసేవామగ్నుఁడై కాలము గడపెను. ఈస్వల్పవయస్సునందే యుభయభాషాభ్యాసముచేసి "ఉత్తరా పరిణయ" కావ్యమూలమున యశము సంపాదించెను. ఈప్రబంధము 1930 లో కవివంశీయులు శ్రీ రేమెల చినవేంకటరాయనింగారు వెలువ

రించిరి. శతావధాని వెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు దానికిఁ బీఠిక వెల
యించిరి.

ఈప్రబంధ మరసినచో నీకవి చక్కని ధారాశుద్ధి కలవాఁడని స్పష్ట
మగును. మను వసుచరిత్రాదులలోని పద్యములచాయ లీతని కవిత్వ
మునఁ గలవు. ఏవో స్వల్పదోషము లున్నను మొత్తముమీఁద నీకవి
ప్రయోగపరిజ్ఞాతయు, వ్యాకరణజ్ఞానము కలవాఁడునుగాఁ దోఁచు
చున్నాఁడు. రెండవయాశ్వాసమున . "భ్రమ, ద్రటదవదాత పత్ర
నికురంబము..." అని ప్రయోగించెను. "ఇట 'నికురుంబము' గాని
'నికురంబము' గాదు" అని పీఠిక. 'నికురంబ' మను అత్వయుక్త
ప్రయోగమే లక్షణసమ్మతము. బాహుళకమువలన ఉత్వము కూడ
రాఁగా "నికురుంబము" అని కూడ నగును. ఉకార విశిష్టమైన
ప్రయోగము ప్రచురితముగా నున్నది. కాని నికురంబము తప్పుకాదు.
ఈపదము నుపయోగించుటఁబట్టి యీకవికి వ్యాకరణజ్ఞానము చక్కఁగా
నున్నదని యవగతము. ఈకవి ధారాశుద్ధి కలవాఁడగుట కీపద్యము
చాలును.

బంతులు దేరి పూఁబొదల పజ్జలఁజేరి సరోజపాళికై
దొంతిగఁ బాఱి జుమ్మనుచుఁ దూరెకుఁదూరెకు మల్లికాసభా
సంతతి దూరి భాసిత రసాల విశాల మరంద ధారల
త్యంతము గ్రోలఁగోరి మధుపావళులొప్పె వనాంతరంబులన్.

—౨ఆశ్వాసము.

ప్రబంధ ప్రారంభమున "శ్రీలకుఁదానకంబగుచు ." ఇత్యాదిగా
నున్న నీలాసుందరీపరిణయములోని మొట్టమొదటి పద్యము యథాతథ
ముగఁ జేర్పఁబడియున్నది. "ఇంతమాత్రమున నియ్యల్పమునందు గ్రంథ
చౌర్యము నారోపించుటకన్న, నీయనకు శ్రీ కూచిమంచి కవిసార్వ
భౌమునియందు పారమైన యభిమానముగలదని చెప్పుటకుఁగా నధికసాధక

మయ్యెడి"నని పీఠికలో వ్రాసిరి. కాని యీ మొదటిపద్యము ప్రక్షిప్తమనియో, లేఖకులెవరో ప్రార్థనమునకు వ్రాసికొని రనియో చెప్పితీరవలయును. దీనికి రెండు ప్రబలకారణములున్నవి. శ్రీరాజన్మహిజా... అని శ్రీకారముతో రెండవపద్యము ప్రారంభింపఁబడినది. అది శ్రీరామప్రార్థనము. ఈకవి "శ్రీరామచంద్ర సాంద్రకరుణాసమాగత కవితామాధురీ ధురీణుఁడ" నని యాశ్వాసాంతవచనముఁ జెప్పుకొనుటచేఁ గావ్యాదిని శ్రీరామప్రార్థనమే చేసినాఁడనుట యుక్తము. 'నీలాసుందరి' లోని 'శ్రీలకుఁదానకంబగుచు' నను పద్యము శివస్తోత్రపరము. ఈ పద్యము మొదటఁ జేర్చుట కవిమతమును జెఱుచుట యగును. అదియుఁ గాక మూఁడవపద్యమున "...కాంచనాచలో, దారశరాసనుండు జయధన్యత మాకొనరించు నెప్పుడున్" అని యీశ్వరుని ప్రార్థించినాఁడు కూడను. దీనినిఁ బట్టికూడ మొదట ముద్రించినపద్యము తీసివేసినఁగాని నసిపడదు. ఉత్తరాపరిణయము చక్కని కావ్యము. ఈ కావ్యకర్తకు భగవంతుఁ డాయువిచ్చిన నిట్టికబ్బములెన్ని సృష్టింపఁబడెడివో? ఈకవి చమత్కారముగ సంభాషించెడి వాఁడనుట కచటివారీ విషయము చెప్పుచుందురు. "పిండిప్రోలు లక్ష్మణకవిగారును వీరును బావమఱఁది పరియాచక మాడుకొనుచుండువారు. ఒకప్పుడు ఏదో సభలో లక్ష్మణకవి కూర్చుండి యుండ మనకవిగారు వెళ్లిరఁట. మరియాదకు లక్ష్మణకవి చోటుచూపి "దొరలకు చోటుచాలా" యనెనఁట. అప్పుడీయన "దొరలకు-చోటుచాలు" ననెనఁట. (దొరలకుము=ఒత్తగిల్లకుము) కవి సంభాషణ చాతుర్యము!

---

# అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి

## 1831-1892

ఆరామ ద్రావిడ బ్రాహ్మణుఁడు. హరితస గోత్రుఁడు. తల్లి: గంగమాంబ. తండ్రి: రంగశాయి. జన్మస్థానము: పిఠాపురము కడనున్న చేబ్రోలు. జననము: 1831 వికృతి సంవత్సరము. నిర్యాణము: 1892. గ్రంథములు: ౧. శ్రీకృష్ణభూపతిలలామ శతకము (1853) ౨. శేష ధర్మములు (ఆఱాశ్వాసముల పద్యకావ్యము 1867) ౩. పాపయ మంత్రి శతకము. ౪. ఆత్మబోధము(శంకరకృతికిఁ దెలుఁగుపద్యములు 1875) ౫. మణిధ్వజచరిత్రము (గ్రంథములభింపలేదు.) ౬. సింహాద్రి రామాధిప శతకము(1876) ౭. భద్రాపరిణయము (1878) ౮. శ్రీకృష్ణ లీలా కల్యాణము(1878) ౯. చాటుధారా చమత్కారసారము.

ఒకప్పుడు మాడభూషి వేంకటాచార్యులవారు పీఠికాపురసంస్థానమునకు శ్రీగంగాధర రామరాయేంద్రుని దర్శనార్థము వచ్చిరి. అప్పుడు అల్లమరాజు సుబ్రహ్మణ్యకవిగారు నిండుకొలువులోనుండి "ఇఁక"అను పదముతో నారంభించి కందములో, ప్రభుకీర్తిని వర్ణింపుఁడని యాచార్యులవారితో ననిరఁట. వేంకటాచార్యులవారు గొప్ప యాశు కవి. వెంటనే యిట్లు చదివిరి.

క. ఇఁక నెవ్వరికీర్తులు నీ
ప్రకటగుణుండైన రామరాయ క్ష్మాభృ
త్సుకృతి జనపోషకుని కీ
ర్తికి సరిగా రావుసుమ్ము పృథ్వీస్థలిలోన్.

సుబ్రహ్మణ్యకవి "మీపద్యములోఁదప్పుకల"దని యాచార్యులవారినాక్షేపించెను. 'తప్పులే' దని యాయన గంభీరముగఁ జెప్పివైచెను. అపుడు సుబ్రహ్మణ్యకవి 'ఇదిగో' నని యీ పద్యమును పఠించెను.

ఇఁక విను నీయశమునకుఁ ద
లఁకి శశి కృశుఁడయ్యెను మఱలఁ బెరుఁగ వేర్వా

ల్లఁకియుఁ గొనెనొకొ తొలిమల కె
లఁకులను శ్రీరామరాయ లలితశ్రేయా!

"ఇఁక" సబిందుకశబ్దమగుటఁ దక్కిన చరణములు సబిందుకప్రాస ముతో నడపవలెనని తర్కణమున వేంకటాచార్యులవారికిఁ దట్టియుండకపోవచ్చును. గంగాధర రామారావుగారు గడుసురాజు "ప్రబంధ కవిత్వమున మీరధికు" లని సుబ్రహ్మణ్యకవిని స్తుతించెను. "ఆశు కవితలో మీరధికు" లని యాచార్యకవి నభినందించెను.

సుబ్రహ్మణ్యకవిచమత్కృతి కప్పు డట్లనెఁగానిసబిందుకనిర్బిందుక ప్రాససాంకర్యముచేయుననిపట్టుదలపట్టిన కవికాఁడు. ఆయనభద్రాపరిణయములో (ద్వితీయాశ్వాసము 75 పద్యము చూ) దీనికుదాహరణ ములున్నవి.

ఈసుకవివరుని చాటుపద్యములు తెలుఁగునవ్యాప్తముగనున్నవి. ఈయన కాట్రావులపల్లి నూతులపై నొకపద్యము చెప్పెను.

దేవాసుర లబ్ధిఁదరువ
నావిర్భూతమయి హాలహాల మపుడు మహా
దేవునకున్ భీతిలి కా
ట్రావులపలినూతులందు డాఁగెంజుండీ.

మాడుగల్లుసంస్థానమునకుఁ బోయినపు డక్కడ నొక్కనియోగికవి వైదికకవులనుబట్టి పడఁద్రిట్టుచుండెనఁట. అప్పుడు సుబ్రహ్మణ్యకవి పట్టలేక యీపద్యము చెప్పెను.

చందనశాఖికన్న విరసంబుగ బూరుగ మేలటన్న తీ
విం దగినట్లు వైదికకవిత్వసుధారస ధారలెల్లఁ జె
ల్వొందఁగ భూతలంబున నియోగికవిత్వముతోడ సాటిరా
దందురు బెట్టిదంబగునటందురు కొందఱు మూఢమానవుల్.

సూరపరాజు మల్లపరాజు అనునాయన గంగాధరరామారావుగారి మిత్రుఁడు. సుబ్రహ్మణ్యకవి యీయనను జూడఁబోయెను. "శ్రీరావు

వేంకటమహీపతిగంగాధర రామారావు" అని వరుసగావచ్చునటులొక కందము చెప్పుఁడని మల్లపరాజుగా రడిగిరి. అప్పుడు వీరిటులు చెప్పిరి.

శ్రీధర! శౌరీ! వైకుం
ఠా! ధర శ్రీరావువేంకటమహీపతి గం
గాధరరామారాయ
ఙ్మాధరునిం బ్రోవు మెపుడు కరుణాదృష్టిన్.

ఈచాటువులు వేటూరిప్రభాకరశాస్త్రిగారు సేకరించి వెలువరించిరి.

సుబ్రహ్మణ్యకవిది పండితవంశము. ఇతని తండ్రి రంగధామార్యుఁడు. నారాయణాచలమాహాత్మ్య కృతికర్త. కవిచకోర చంద్రోదయ, సత్యభామావిలాసాదులు రచించిన రామకృష్ణకవి కితఁడు భిన్నోదరసోదరుఁడు. సుబ్రహ్మణ్యకవి నాగాభట్ల నరస కవితో నుభయభాషలు పఠించెను. చాలవఱకు స్వయంకృషి చేసి సాహిత్యనిష్ణాతుఁడాయెను. వసుచరిత్రము-ఆముక్తమాల్యద వీరి కభిమానితగ్రంథములు. జ్యోతిషభాగముకూడ నీయన చక్కఁగ నెఱిఁగెను. అదికొంత తొలుత జీవనాధారమైనది. క్రమముగాఁ గవిత్వరచనమే ప్రధానవృత్తిగాఁ బెట్టుకొని రాజదర్శనము చేయుచు సుబ్రహ్మణ్యకవి తనలేవడి నెట్టుకొనుచుండెను. 1853 లో మాడుగల్లు సంస్థానాధిపతియగు శ్రీకృష్ణభూపతిపై సీకవి సీసపద్యములశతక మొకటిచెప్పెను. అది "శ్రీకృష్ణభూపతి లలామశతకము". అప్పటికిఁ గవియీ యిరువది రెండేఁడులు. మాడుగల్లుసంస్థాన పండితులు మనకవి నెన్నో తిప్పలు పెట్టిరఁట. మంత్రిప్రెగడ సూర్యప్రకాశరాయకవి మున్నగువారు నాఁడు తత్సంస్థాన విద్వత్కవులు. అక్కడివారు "కుట్రయొనర్చి లేమ తన గుబ్బలయుబ్బు సహింప లేమిచేన్." అను సమస్య నిచ్చి, నిలుచుండఁగాఁ బూరింపుమనిరి. అది యీకవిచే నిటు పూరింపఁబడియె.

వట్రువహారరత్నములు వన్నె నగల్ పులిమీఁదవచ్చునా
పుట్ర యటన్నరీతి జిగిఁ బొల్పగు చూచుకలీలఁ జూచుమన్

దొ్రటిలనేల? కేలఁగొని గోరులనొక్కుము నాథయంచుఁ దాఁ
గుర్రటయొనర్చె లేమ తనగుబ్బలయుబ్బు సహింపలేమిచేన్.

ఇట్టి పరీక్షల కాఁగిన సుబ్రహ్మణ్యకవిని నూడుగల్లుతేఁడు మెచ్చి యాస్థానకవిగా నర్థించెను. కాని జన్మస్థానమున కాయూరు దూర మగుటచే నంగీకరింపక కవిగారు వార్షికబహూకారము వచ్చునటుల ప్రార్థించెను. 1853 మొదలు 1869 వఱకు నాసంస్థాన వార్షికవిత్తము సుబ్రహ్మణ్యకవి పొందుచుండెను.

1869 లో పీఠికాపుర సంస్థానమున మాసవేతన మేర్పడినది. గంగా ధరరామరాయేంద్రుఁ డీకవిప్రతిభఁదెలిసికొని సన్మానించెను. "భద్రా పరిణయము" అను ప్రౌఢాంధ్ర ప్రబంధ మా మహారాజున కంకితము గావించెను. ఏతత్కృతిప్రదానవిషయ మీ పద్యము తెలుపును.

శాలివాహనశక సంవత్సరము లిందు
　　గగనకరీందుసంఖ్యల నెసంగ
జరుగుప్రమాధివత్సర మార్గశిరశుద్ధ
　　సప్తమీ శుక్రవాసరమునందు
శ్రీ మహారాజభూషిత చరిత్రుండు సూ
　　ర్యారాయభూనాయకాత్మజుండు
రావు గంగాధరరామరాయక్షమా
　　ధవుఁడు సుబ్రహ్మణ్య కవివరునకుఁ
బీఠపురదుర్గసౌధంపుఁబెద్దకొలువు
నందు భద్రాపరిణయకావ్యంబు నంది
యధికతరమాన్యభూమి వెయ్యాఱులును సు
వర్ణ వలయుంబులును సేలువలు నొసంగె.

ఈభద్రాపరిణయము నాలుగాశ్వాసములుకలది. కాణాదము పెద్దన సోమయాజి భద్రాపరిణయమను మాఱుపేరుగల ముకుందవిలాస ప్రబం ధము రచించెనని వీరేశలింగముపంతులుగారు వ్రాసిరి. ఆ ముకుంద

విలాసములోని కవితారీతు లీసుబ్రహ్మణ్యకవి కొన్ని సంగ్రహించెను. అందలిపద్యములు పద్యములుగాఁగొన్ని యిందున్నవి. కథలోఁగూడఁ బెద్ద మార్పులేదు. భావములు చాలవఱకు దానిని బోలినవే. ఈవిషయము శ్రీ నడకుదుటి వీరరాజుగారును వెల్లడించిరి. ఆకవి కవితపైఁగల యభిమానమున నీసుబ్రహ్మణ్యకవి యిట్లు చేసినాఁడని సమర్థించుకొనవలయును. పురాణపండ మల్లయ్యశాస్త్రిగారి వ్యాఖ్యతో 1912లో నీగ్రంథము నాఁటి పీఠికాపుర ప్రభువు లావిష్కరించిరి. సుబ్రహ్మణ్యకవి సాధారణకవి కాఁడనుట కతనిఁగూర్చినకథలు చాలఁగలవు. పెద్ద పెద్ద సంస్థానములకుఁ బోయి యతఁడుచూపిన చిత్రకవితాదు లందులకుఁ దార్కాణ. ఆయన 'చాటుధారాచమత్కారసార' మనునొక గ్రంథము సంధానించెను. అందుసంస్కృతమునఁ జాటువులుగ నుండి పండితులచేఁ బరంపరాయాతములై యున్న గంభీరార్థకములగు శ్లోకములకు సులభమైనయర్థము వ్రాయఁబడియున్నది. ప్రాచీనాధునాతనపద్యము లెన్నో యందున్నవి.

కమలాకర కమలాకర
కమలాకర కమల కమల కమలాకరమై
కమలాకర కమలాకర
కమలాకరమైనకొలను గని రా సుదతుల్.

ఈపద్య మిచ్చి మాడుగుల సంస్థానములో నెవరో పండితులు సుబ్రహ్మణ్యశాస్త్రిగారి నర్థము చెప్పుమనిరఁట. నాఁటి వారిలో నిట్టి పాషాణములను బ్రద్దలుగొట్టు దిట్టలు చాలమంది యుండువారు. మన శాస్త్రిగారు వెంటనే దానికర్థము వివరించి చెప్పిరి. తరువాత సేకరించిన కొన్ని చాటువులకు వ్యాఖ్య వ్రాసి "చాటుధారా చమత్కారసారము" వెలువరించిరి.

జయంతి రామయ్యపంతులుగారికి వీరికిని మైత్రి. రామయ్యపంతులుగారి ప్రోత్సాహమువలన నీకృతి రచితమైనది. ఆవిషయమును విస్పష్టము చేయు శ్లోక మీక్రిందిది విధిగా నుదాహరింపఁదగినది.

శ్లో. ఏతాదృగ్భిర్గుణ మణిగణై ర్భాషితేనైవ తేనా
సజ్ఞాంప్రాప్య శ్రితహితకరీం ప్రేమవన్మానపూర్వాం
అల్లంరాజాన్వయమణి రసౌ రంగశాయ్యార్యపుత్ర
స్సుబ్రహ్మణ్యస్సుకవి రకరో చ్చాటుధారార్థసారమ్"

రామయ్యపంతులుగారి నుద్దేశించి సుబ్రహ్మణ్యకవి 'అంతర్లాప' యిటులు చెప్పెను. ప్రశ్నోత్తరములు లోపలనే నిగూఢముగా నుండు సమస్యకు 'అంతర్లాప' యని పేరు.

చెప్పినాఁడ రెండు చిత్రోత్తరము లిందు
నల జయంతి రామయార్యవరుని
సువచనమున నే దడవిలోఁజరించు నె
ద్దీశ్వరునికిఁ బ్రియము నెక్కుడనఁగ.

సుబ్రహ్మణ్యకవి యాధునికుఁడగుట గ్రంథవిమర్శములను కూడ వ్రాసెను. శ్రీమన్మాడభూషి వేంకటాచార్యకవి రచించిన 'భరతాభ్యుదయము' న దోషము లున్నవని సప్రమాణముగఁ జూపి రాజయోగి పత్రికలో వెలువరించెను. కాని యిక్కవి రేఫద్వయమైత్రి, అఖండయతి, కొన్ని ప్రాచీనలాక్షణికానభిమత సంధులు విడిచిపెట్టలేక పోయెను. అదియటుండె, సుబ్రహ్మణ్యకవి ప్రతిభావ్యుత్పత్తులు సమానముగాఁ గల కవివరుఁడు. వారిపద్యధారకుఁ జివర నొక యుదాహరణ మిచ్చి విడిచెదను.

పగడపుమోవితో జిలుఁగుఁబయ్యదతో విడిముంపుసొంపుతో
నిగనిగ నుబ్బుసిబ్బెముల నిగ్గులతోఁ గగుగుబ్బదోయితో
సొగసగు వేణితో బెళుకు చూపులతో లలితేతనవ్వుతో
జిగివగగుల్కవచ్చి యొక చేడియ చూచెఁ ద్రిలోకమోహనున్.

భద్రాపరిణయము ౪. ౫౭.

# మండపాక పార్వతీశ్వరశాస్త్రి

## 1833-1897

వెలనాటివైదిక బ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుడు. పారాశర గోత్రుడు. తల్లి: జోగమ్మ. తండ్రి: కామకవి. జన్మస్థానము విశాఖపట్టణ మండలములోని పాలతేరు ( బొబ్బిలి సమీపము ). జననము : 18౩3 సం॥ జూన్ 30 తేది. నిర్యాణము : 1897 సం॥ జూన్ 30 తేది. విరచిత గ్రంథములు : ఏకప్రాస శతకములు – ౧. బ్రహ్మేశ శతకము ౨. చిత్రశతి ౩. వేంకటశైలనాయద్విశతి ౪. విశ్వనాయక శతకము ౫. విశ్వనాథస్వామి శతకము ౬. కాశీ విశ్వనాథ శతకము ౭. పార్థివలింగ శతకము ౮. పరమశివ శతకము ౯. సూర్యనారాయణ శతకము ౧౦. బాలశశాంక మౌళి శతకము ౧౧. చంద్రఖండకలాప శతకము ౧౨. కలిపురుష శతకము ౧౩. ఈశ్వర శతకము.

శతకములు (౨౩)

౧. సీతారామ ద్వ్యర్థిశతకము ౨. శ్రీ జనార్దన శతకము ౩. కాళికా విశ్వనాథ సీసపద్య శతకము ౪. పరమాత్మ శతకము ౫. పార్వతీశ్వర శతకము ౬. కాశీవిశ్వనాథ ప్రభూశతకము ౭. సూర్యనారాయణ శతకము ౮. వేంకటరమణ శతకము ౯. వరాహ నరసింహశతకము ౧౦. జగద్రక్షకా శతకము ౧౧. రమానాయక శతకము ౧౨. ఆంజనేయ శతకము ౧౩ రామరక్షాశతకము ౧౪. గోపాలకృష్ణ శతకము ౧౫. బాలకృష్ణ శతకము ౧౬. రఘుపతిశతకము ౧౭. జగన్నాయక శతకము ౧౮. రామలింగేశ్వర శతకము. ౧౯. సర్వకామదా శతకము ౨౦. గణపతి శతకము ౨౧. హరిశతకము ౨౨. హరిహరేశ్వరశతకము. ౨౩. మాలికాకృతులు, దండకములు మఱి కొన్ని కలవు.

కావ్యములు.

౧. శ్రీ రాధాకృష్ణ సంవాదము ౨. బొబ్బిలి మహారాజ వంశావళి ౩. ఉమాసంహిత ౪. కాంచీమహాత్త్వము ౫. అమరుకము ౬. అక్షరమాలి కాఖ్య నిఘంటువు.

గద్యకావ్యములు.

౧. యాత్రాచరిత్ర ౨. గురుచిత్రకథ ౩. లఘుచిత్రకథ ౪. శ్రీ బొబ్బిలి మహారాజ వంశావళి.

సంస్కృత కృతులు.

౧. గుణశ్లోకాది చిత్రరచన ౨. కవితా వినోద శ్లోకము 3. సీతా దేవీస్తుతి ౪. కాశీశ్వరాష్టకము ౫. మంగళాష్టక చతుష్టయము ౬. శ్రీ వేంకటగిరి ప్రభుద్వ్యర్థిశ్లోక కదంబము ఇత్యాదికము.

పార్వతీశ్వరశాస్త్రిగారు రభిన వాంధ్రకవితా పితామహుఁడని పేరు చెందిన పండితుఁడు. ఈయనకుఁ బ్రబంధకవిత్వమందును శతక కవిత్వమందును బెద్దమమకారము. శతకకవులలో నీయనకున్నది యుత్తమ స్థానము. వీరు వ్రాసినశతకములు శతసంఖ్యగలవి. సత్యవోలుభాగవతకవి మున్నగు వారు శతకశతము రచించినట్లు తెలియుచున్నది. తెలుఁగు వాఙ్మయమున శతకములకు గొప్ప విలువయున్నది. అది యిప్పుడిప్పుడే యిరువదవ శతాబ్దినుండి యించుక సన్నగిల్లుచున్నది. నేఁడును 'కాళహస్తీశ్వర' ప్రభృతిశతకములను గౌరవముతోఁ జూచుచున్నవారు చాలమందియున్నారు. పార్వతీశ్వరకవి ౧౯వశతాబ్దిలోఁ బ్రసిద్ధుఁడగు శతకకవి. కేవలము శతక కవియే కాదు. ఆశుకవి, ప్రబంధకవికూడను. వీరినిగూర్చి చెప్పవలసిన విశేషములు చాలఁగలవు.

ఈయన పితామహుఁడు పేరయసూరి. ఇందుమతీపరిణయము, నిర్దుష్ట నిరోష్ఠ్యదాశరథిశతకము, లక్ష్మీనృసింహమూర్తిస్తుతి కృతులు రచించిన వారు వీరే. పార్వతీశ్వరశాస్త్రిగారితండ్రి కామకవి బ్రహ్మోత్తరఖండము, కార్తికమాసవ్రత మాహాత్మ్యము, బలరామక్షేత్ర మహాత్మ్యము, జానకీరామశతకము, సూర్యనారాయణ రామప్రభుశతకములు రచించిన విద్వత్కవి. పార్వతీశ్వరకవి యన్నగారు రామస్వామి శాస్త్రి వేదాంతకృతికదంబము, గంగాలహరి, గంగాస్తవము వ్రాసిరి. పార్వతీశ్వరశాస్త్రిగారు తండ్రిగారి సన్నిధిని మొదటఁ జదువుకొనిరి. తరువాత తాతా సూర్యనారాయణశాస్త్రిగారికడఁ బఠించిరి. శ్రీ త్రిపదేంద్రస్వామివారి యనుగ్రహమున నుపనిషత్పాఠము చేసిరి. స్వయంకృషిచే బలమైన పాండిత్యము సంస్కృతాంధ్రములలో సంపాదించిరి. కవిత్వము సహజముగ నున్నదే. ఈ సహజకవితాధార కాయసాధా

రణపాండిత్యము తోడైనది. పంద్రెండవ యేటనే పాటముగఁ గవిత వ్రాయ నారంభించి "కవితా లతాంకురము" పంతముపట్టి గంటలోఁ జెప్పెను. చిన్ననాఁటనే వేంకటగిరి మున్నగు సంస్థానముల కేఁగి కవితాప్రదర్శనమున సత్కరింపఁబడెను. బొబ్బిలి సంస్థానమున విద్వత్కవిగాఁ గుదిరెను. ఆయాసంస్థానరంగములలో నీయన కనఁబఱిచిన కవితాచతురత వేనోళ్ళ మెచ్చుకోలువడసినది. పార్వతీశ్వర కవి తత్ జ్జీవిత విశేషములు 'ఆత్మచర్య' యను సీసపద్యములలో వ్రాసికొనెను. ఇది యొకటి చదువుఁడు:

మఱియు నద్దాతలో వఱపు పట్టగఁజూచి
గుఱుతు తప్పక వానకురియునట్లు
మంచిపద్యములు గావించి తెండని రంగ
రాయవిభుం డాదరమునఁ బల్క
నీమీఁద భారంబు నేనుంచి యమృత బీ
జాక్షరఘటిత పద్యంబు లైదు
పంచరత్నము లనఁ బచరించి నవరత్న
పద్యయుక్తముగఁ దత్ప్రభున కొసగఁ
గాక తాళీయునయమున గాలివాన
కురియఁ జేసితి వది మాన్పఁగోరి మాన్పి
తౌర! యతివృష్టి కష్టహారాష్టకమున
హారిహారేశ్వర దేవ! మహానుభావ!

ఇచట రంగరాయవిభుఁడన బొబ్బిలి ప్రభువు వేంకటశ్వేతాచలపతి రంగారావు బహద్దరువారు. ఈకవి యిట్టి సిద్ధ వాక్కనుటకు సందేహింపఁ బనిలేదు. బొబ్బిలిలో నితఁడు 1876లోఁ బ్రవేశించి 1897 వఱకు సంస్థాన కవిగా నుండెను. అదియే వీరి జాతకమున ఘనదశ. అంతకుమున్ను శ్రీ విజయనగర మహారాజు దర్శనమునకుఁ బోయి 1867లో నచ్చటఁగవితా ప్రతిభాప్రకటనము చేసెను. కాని యాస్థాన

కవితాస్థానమున నుండుటకు యోగము పట్టలేదు. ఆయన బొబ్బిలిసంస్థానకవి కావలసియుండెను. ఆనందగజపతిదర్శనము చేసి పార్వతీశ్వరకవి యమూల్య పద్యములు చదివెను. అం దిది యొకటి.

అభ్రప్రదుఁడగు మేఘుఁడు బలి
కుప్రదుఁడగు ఖేచరుండగు నసుప్రదుఁడ
శ్రీప్రదుఁడగు సర్కుఁడు నం
దప్రదమునకు సాటియనఁగఁ దగునే వీరిన్.

విజయనగరములోని యాస్థానపండితుఁడు ముడుంబ నరసింహాచార్యకవి "అన్నవ తాళఁజాల కహహా! యని తల్లడమందె నెంతయున్" అను సమస్యనిచ్చి "వెన్నెలఁగాయఁ గాయజుడు వేమఱుమైవిరిగోలలేయ లే" యని పూర్వార్థము వెనుక నేను పూరించితినని తక్కిన చరణములు శాస్త్రులుగారు చెప్పవలయుననిరఁట. అప్పుడది యాశువులో నను ప్రాసము వచ్చునట్లు నీ రిట్లు పూరించిరి.

క్రొన్ననగోయఁ గోయునుచుఁ గోయిలకన్నెఅఁ జేయఁ జేయటుల్
కిన్నరఁబాయఁ బాయసము కీల్కొని పొంగిన చాయ చాయలన్.

1865 లో వావిలివలస జమీందారగు ఇనుగంటి సీతారామస్వామిగారి దర్శనమున కీకవి వెళ్ళినపుడు వసుచరిత్రలోని పద్యమునిచ్చి సంస్కృతీకరింపుమనిరి. తెలుగును సంస్కృతములోనికి నింతమాధురీధుర్యముగా మార్చిన మార్పుఁగల కవులు తక్కువ.

ఆతన్వంగి యనంగఘూంకరణవ జ్జ్యాముక్త చూతాస్త్ర ని
ర్ఘాతం బోర్వక తమ్మ్మలంచుఁ దటినీ గర్భైక సంజాత కం
జాతవ్రాతము మాటుచెంద నది యోఁచన్ సాఁగె మున్మందుగా
జ్ఞాతిశ్ఛేదనలేన కిమ్మనెడి వాచాయాఢి సత్యమ్ముగాన్.

సాఽనవ్యాస్మరఘుంక్రియాశ్రయ గుణోన్ముక్తామ్రబాణక్షతిం
తస్వీ సారసజాతి రిత్యవధృతా పద్మాటవీ మాశ్రితా

సాసింధూపరసంభవాపి పురత స్సద్బాధనే చోద్యతా
జ్ఞాతి శ్చేదనలేన కిన్విత వచ స్సత్యం యథాస్యాత్తథా.

కవి యీవిషయ 'మాత్మచర్య' లో నిటు వివరించుకొనెను.

సుతనిరామయతకై సూర్యనారాయణ
స్వామిని గని హర్ష వల్లినుండి
వావిలివలసకు వచ్చి యున్నంటి సీ
తారామవిభుఁ గాంచి తత్ప్రతిజ్ఞ
నణఁచి యా 'తన్వంగి' యనెడు వసుచరిత్ర
లోని పద్యమునకు శ్లోకరచన
ప్రతిన నిన్నూటయేఁబదియారుపద్యముల్
గలుగుషోడశవిధ కందరచన
తత్కవులకన్న నెక్కుడుధార గల్గి
వింతయగునట్టి యాశుకవిత్వరచన
నాకుఁ గల్గించి చెలగించినాఁడ వౌర!
హరిహరేశ్వర దేవ! మహానుభావ!

ఆ వావిలివలస ప్రభువులే యిన్నూటయేఁబదియాఱు విధములుగఁజదువఁదగిన కందము వ్రాయుఁడని పార్వతీశ్వరశాస్త్రిగారి నడుగనాయన యాశువుగ నిట్లు చెప్పిరి.

శ్రీరామ! దేవ! పావన
భావా! భావంగ! మాగ్య! పండిత! భావా
శ్రీవాసు! దేవ! బహ్వాను
భావా! భావా! భవజనక! పాలిత! భావా
ఏకమతిన్ భేకగతిన్
సాకల్యమునం గనుండు షట్పంచాశ
చ్ఛ్లోకో త్తరద్విశతి సం
ఖ్యాకములై యుంద మొందుఁ గందములిందున్.

ఆశుధారాపరీక్షలో నీకవి మొదటితరగతిని నెగ్గినాఁడు. చతుర్విధకవిత్వ ములందు నీకవి కడుదిట్ట. ఒక శివరాత్రి యుపవసించి లింగోద్భవకాలమున మొదలిడి తెల్లవాఱుసరికిఁ బార్వతీశ్వర శతకము రచించిన యాశుకవివరుఁ డీయన. రెండేకప్రాసశతకములుమూన్నాళ్ళలోరచించి చూపిన శీఘ్రకవితాచతురుఁడు. యమకముగఁబద్యములల్లుట, ద్విత్రి చతుష్ప్రాసములతోఁ గవితవ్రాయుట యీకవికి వేడుక.

వీరి రాధాకృష్ణసంవాదము కృష్ణాభ్యుదయము అమరుకము తెలుఁగు నాఁటఁ బ్రచారమున నున్నవి. వెనుకటివారిలో, తాళ్ళపాక తిరువేంగళప్ప అమరుకాంధ్రీకర్తలయందగ్రగణ్యుఁడు. అధునాతనులలో నమరుకము నాంధ్రీకరించినవారు ఝుబాఱుగురు కలరు. వానిలోనెల్ల వీరి తెలిఁగింపు చాల గొప్పగా నున్నది. రాధాకృష్ణ సంవాదములోని యీ క్రిందిపద్యము వీరి తాతతండ్రుల విశిష్టత కొక గుఱుతు.

సీ. శ్రీమీఱ నుభయభాషా ముఖ్య సత్కృతుల్
 తజ్జ్ఞులెన్న నుదంకితములు చేసి
యశముగాంచిన పేరయ మనీషిమణికిఁ బౌ
 త్రత్వంబుఁ గార్తికవ్రతమహత్త్వ
శివమహాత్మ్యాద్యనేకవిధ ప్రబంధంబు
 లొనరించి సత్కవి వినుతిఁ గనిన
పారాశరసగోత్ర పావనుండగు మండ
 పాక కామేశ్వర పండితునకు
మహిత పుత్రత్వమును గాంచి బహువిచిత్ర
చిత్రశతి ముఖ్య సత్కృతుల్ చెప్పి మెప్పు
వడసితివి గద కులకీర్తి వర్ధిలంగ
సరసగుణసాంద్ర ! పార్వతీశ్వరకవీంద్ర !

పార్వతీశ్వరశాస్త్రిగారి మనుమలు పార్వతీశ్వరశాస్త్రిగారుసభాషోపాసకులై తాతగారివి మఱుఁగునఁ బడిన కవితారహస్యములు కొన్ని

భారతి కందిచ్చిరి. అముద్రిత గ్రంథచింతామణి పార్వతీశ్వరశాస్త్రి ప్రతిభకు నికషము. తత్పత్రికాధిపతులు పూండ్ల రామకృష్ణయ్యగారు వీరి చరిత్ర మామూలాగ్రముగ వ్రాసిరి. అది పార్వతీశ్వరశాస్త్రి 'ఆత్మచర్య' యనఁదగు "హరిహరేశ్వర శతకము" నకుఁ బీఠికగా వెలసియున్నది. పార్వతీశ్వరశాస్త్రిగారికిని, మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారికి సీపత్రికాద్వారమునఁ బెక్కు-నాళ్ళు భాషావిషయక వివాద మాపాదిల్లినది.

పార్వతీశ్వరశాస్త్రిగారు మహాభక్తులు. కడకాలమున "మృత్యుంజయునకు నమస్కరింతుఁ దరింతున్" అను మకుటముతోఁ బద్యములు చెప్పుచు ముప్పదియైదు పద్యములు పూర్తిచేసి జీవము విడిచిరి. వీరు జీవించిన యెనుబదిరెండేండ్లలో శతాధికములగు కృతులు విరచించిరి. తుదకు మిగిలినకృతులు కూడ నెనుబదిరెండే. ౧౯ వ శతాబ్దిలో నిట్టి యాశుకవి లేఁడనుటకు సందేహము లేదు. పార్వతీశ్వరశాస్త్రిగారిశతక కవిత యిటులుండుననుటకొక పద్యమునుదాహరించియిఁక విరమించెదను.

అక్షులే నిన్గనునట్లు హస్తములు నిన్నర్చించునట్లాత్మని
న్నక్షీణంబుగ నమ్మునట్లు చెవి నిన్నాలించునట్లాస్యమున్
దీక్ష న్నిన్గొనియాడునట్లు కరుణ న్వీక్షించి రక్షింపుమీ
సాక్షాన్మంగళ సంఘసంఘటన కృష్ణా! బాలకృష్ణా! హరీ!

# మాడభూషి వేంకటాచార్యకవి

## 1835 - 1895

వైష్ణవబ్రాహ్మణుఁడు. కౌశికగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. తల్లి: అలివేలమ్మ తండ్రి: నరసింహాచార్యులు జన్మదేశము: నూజవీడు. జననము: 1835. నిధనము: 1895 మన్మథనామ సంవత్సర ఫాల్గుణ బహుళ తృతీయ. గ్రంథములు: ౧. భారతాభ్యుదయము (ప్రబంధము) ౨. వామన నాటకము, 3 పుష్పబాణవిలాసము, ౪. హంససందేశము, ౫. మదనమోహన చరిత్ర (వచనము) ౬. బృహద్వ్యాకరణరత్నాకరము, ౭. రామావధూటీ నక్షత్రమాల. (చాటుపద్యమణి మంజరి - ద్వితీయభాగము చూడుఁడు). ౮. ఆనంద గజపతిపై వ్రాసిన ౬౫. సీసములు

శతావధానములను ప్రచారములోనికిఁ దెచ్చినవారిలో వేంకటాచార్యులుగారు కనిష్ఠికాధిష్ఠితులు. భట్టుమూర్త్యాదులు శతలేఖినీపద్య సంధానధురంధరుల మని చెప్పికొనినారు. వేంకటాచార్యులవారు అసాధారణుఁడైన మేధావి. ఈయన గంటకు వందలకొలఁది పద్యములు చెప్పఁగల నేర్పరులనుట యటుంచి, యేకసంథాగ్రహణమున నూరుల కొలఁదిపద్యములు అప్పగించు బుద్ధిమత్తరులు. వీరి మేధావిశేషము నకుఁ జెక్కుకథలు తెలుఁగుదేశమునఁ బ్రాఁకియున్నవి. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు "చాటుపద్య మణిమంజరి" లో వెలువరించిన కథ యొకటి ప్రకటించెదను.

"పనప్పాకం అనంతాచార్యులుగారి దగ్గఱ కొకప్పు డవలిప్తుఁడగు అరవదేశపు విద్వాంసుఁడువచ్చి స్వరచితము లైన శ్లోకములను జదువుచువివరించుచుఁ బ్రశంసించుకొనుచు నుండఁగా వేంకటాచార్యుల వారు వినుచుండిరి. పదిశ్లోకములయినవి. ఆత్మశ్లాఘాపత్య ప్రశంసాపరాయణుఁడుగా నున్న యాపండితునితో 'అయ్యా ఈశ్లోకములు పిన్ననాఁడు మానాయనగారు నాకుఁ జెప్పిరి. ప్రాచీనకవికృతములైన

యీశ్లోకము లనంతాచార్యులుగా రెట్లుగ దని యాత్మీయములుగాఁ జదువ నారంభించితిరా?' యనిపలికిరఁట. కుపితుఁడై వెడవెడ నవ్వు నవ్వి యాయవధానపండితుఁడు వేంకటాచార్యులుగారి నెఱుఁగక 'ఏదీ నీకు వచ్చునేని చదువుము, రచించినవాఁడను నేనే యిక్కడ నుండఁగా నాతోనే యిట్లు పలికెద వేమయ్యా! ఎవఁరవీవు?' అని తుటారించెనఁట. ఇదిగో చదువుచున్నా నని యేకసంథాగ్రహణమున నప్పగించిరి. వెల్ల బోయి యాపండితుఁడు వేఁడుకొనెనఁట. మీమాహాత్మ్యము నెఱుఁగ నైతిని మన్నింపుఁడని-"

ఇట్టి కథలు గాథలు వీరినిగూర్చి తత్రితండములు, కని విని యెఱుఁగనిభావములోనివి కొన్ని పద్యములు వీరికడ నొక్కసారిచదివినఁజాలును. అవి యద్భుతముగా వర్ణించిన పద్యముల వలె నప్పగించువారఁట. ఆయనధారణాశక్తి యట్టిది. ఒకగదిలో నూఱు చెంబులు పెట్టిపుల్లతో ముందు వరుసగా వాయింపఁగా, గది వెలుపలనుండి విని మరల నడుమ నేచెంబుపై దెబ్బకొట్టినను 'ఇది యీసంఖ్యగల చెంబు' అని చెప్పువారఁట. శబ్దగ్రహణమునఁగూడ నాయన కిట్టి బుద్ధిసౌక్ష్మ్య ముండెడిది. దేవులపల్లి సోదరకవులు, తిరుపతివేంకట కవులు వీరినివిని యవధానము లారంభించిరి. తిరుపతివేంకటకవులు అవధానలతను దేశముదేశ మెల్లఁ బ్రాఁకించిరి. వేంకటాచార్యులుగారు శతావధానియే కాదు. సంస్కృతాంధ్రముల లోఁతుచూచిన పండితుఁడు. తర్కవ్యాకరణములు గురుకులక్లిష్టుఁడై గఱచెను. మొత్తముమీఁదఁ జదివినదానికంటెఁ జూచిన దెక్కువ. సంస్థానముల కెక్కుట-యవధానములు గావించి యాశుకవిత చెప్పుట వీరియుద్యోగము. తెలుఁగురాజు లెందఱో వీరినాదరించి సత్కరించి పంపిరి. ప్రభువులకు నెలవైన నూజివీటఁగాఁపురము. తోఁచినప్పు డొక్కొక్క ప్రభుని దర్శించి ప్రతిభచూపి కానుకలఁగొని తెచ్చియింటఁ గూర్చుండి గ్రంథరచనము చేయుచుండు వారు. పీఠికాపుర మహారాజు

గంగాధర రామారావుగారిని దర్శించి 1879 లో నవధానము చేసెను. ఆయవధానమునకు మహారాజు మహైశ్చర్యభరితుఁడై మనకవివరుని గొప్పగ సన్మానించెను. ఈరీతి నీయన పొందిన రాజగౌరవములకు మేరలేదు.

చింతకాయ కలేకాయ బీరకాయ తమారికే

ఉచ్చింతకాయ వాక్కాయ సాధకాయ తమాంజలిమ్.

ఈ మొదలైన కొంటెరకపు శ్లోకములు వేంకటాచార్యరచితములుగాఁ జాలమంది చదువ విందుము.

ఆచార్యులుగారొడ్డుపొడుగులుగల మానిసి. స్ఫురద్రూపి. ఆయన రసికతకు నిదర్శనములుగాఁ గొన్నిరచన లున్నవి. "రామావధూటి తారావళి" వానిలో నొకటి. ఆపద్యములు రసఘుటికలు. రెండుదా హరింతును.

సీ. శ్రీరాధికాకుచాశ్లేషజ సంతోష

వివశుఁడౌ శ్రీకృష్ణవిభున కెరఁగి

సకలవిద్యావ్యాప్తి సాధనభూతయౌ

శారదాంబకు నమస్కారములిడి

మైహికానంద ప్రవాహపూరకమైన

శృంగారరస మాత్మ నిరవుకొలిపి

మదనసామ్రాజ్య సింహాసనారూఢులౌ

పురణించు రసిక శేఖరుల నెంచి

వివిధ రతితంత్రపాండిత్య భవమహేను

భవములె పదార్థములుగ నేర్పఱచి సీసస

పద్య నక్షత్రమాలిక భావవిదుల

మనము లలరంగఁ గూర్తు రామావధూటి.

ఒకనాఁటి కలలోన సకియ ! నీకాలిపా
 జేబులో జందెంబు చిక్కినట్లు
ఒకనాఁటికలలోన సకియ ! కౌఁగిటఁజేర్చు
 తఱిఁ గంటె గడ్డానఁ దాఁకినట్లు
ఒకనాఁటి కలలోన సకియ! మెల్లన నాదు
 గూబలో 'క్కొక్కొరో' కూసినట్లు
ఒకనాఁటికలలోన సకియ ! నీ చేతిపో
 చీలోన జందెంబు చిక్కినట్లు
  ఇన్నివిధముల నచ్చట నున్ననాఁటి
  వన్నెలన్నియుఁ గలలోన వచ్చి యిచట
  గాసి గూర్చుచున్నవి నిన్నుఁ బాసి యెట్లు
  మరులు నిల్పఁగనేర్తు రామావధూటి !

వేంకటాచార్యగారు నూజవీటి శ్రీరాజా శోభనాద్రి అప్పారావుగారి సంస్థానమున విద్వత్కవి. ఈయన కభినవపండితరాయ లని బిరుదము కలదు. వీరితండ్రి నరసింహాచార్యులుగారును కావ్యకర్తలు. వల్లీపల్లవోల్లాసము, రుక్మిణీకల్యాణము, సిలాపనిందానివారణము ఈగ్రంథములు వారు రచించినవే. వీరేశలింగము పంతులుగారి కవులచరిత్రలో తండ్రికొడుకుల చరిత్రలు రెండును గలవు. మన వేంకటాచార్యులుగారు 'భరతాభ్యుదయ' మను ప్రౌఢప్రబంధము సంతరించిరి. దీని ప్రాశస్త్యము కవిచరిత్రమున నుగ్గడించియుంటఁ బునరుక్తి సేయలేదు. ఈయనప్రబంధకవిత్వ మెటులుండునో యాశుకవితయు నించుమించుగ నట్లేయుండుననుట యత్యుక్తిగాదు. శోభనాద్రి అప్పారావుగారు 'పుష్పబాణవిలాసము' నాశువుగా నాంధ్రీకరింపుమని యాచార్యులుగారికాజ్ఞాపించిరఁట. ఆయన కాశువన్న బ్రహ్మాండముగాదు. ఈపద్య మెంత యందముగా నడపించిరో చదువుఁడు.

వరసుఁడు దూరమేఁగుసని చాలఁగ నామది చింతనొందు న
ల్లరకు వినోదియైనను గళానిధి వైరమొనర్చె వెండియున్
బరభృతకాకలీరవముఁ బాసి తనర్చును నిష్కుటీ విసృ
త్వర మలయానిలంబుఁ నఁ బ్రాణము లేహరియించు నెంతయున్.

ఆచార్యులుగా రనపళ్యాలు. 'భరతాభ్యుదయము' వారిపుత్రుఁడు. అవధాన ప్రతిభా ఖ్యాతమగు కీర్తి వారిపుత్రిక. గుంటూరిలో న్యాయవాదులుగా నున్న వేదాంత నరసింహాచార్యులుగారు వీరి దత్తకుమారులు.

---

# ముడుంబ నృసింహాచార్యకవి

## 1841 - 1927

శ్రీవైష్ణవులు. తండ్రి : వీరరాఘవాచార్యుఁడు. జన్మస్థానము : శ్రీకూర్మము దగ్గఱ వంశధారా తీరస్థమగు అచ్యుతపురి : జననము : ప్లవంగసంవత్సర భాద్రపదబహుళనవమి 1841 సం॥రం సెప్టెంబరు 22 నిర్యాణము ; ప్రభవసంవత్సర భాద్రపదబహుళ ద్వాదశి. 1927 సెప్టెంబరు 22 తేదీ. గ్రంథములు ; ౧. రంగేశ శతకము ౨. ప్రౌఢా శృంగారము ౩. ముగ్ధాశృంగారము ౪. కామినీదృష్టిశృంగారము ౫. అంగశృంగారము ౬. సంకీర్ణశృంగారము ౭. శ్రీకృష్ణచాటువులు ౮. సత్యశతకము ౯. వృష్టిపంచాశత్తు ౧౦. గరుడాచల నాటకము ౧౧ కృతులు. ౧౨. హరికథలు సంస్కృతగ్రంథములు: ౧. బ్రహ్మసూత్రభాష్యము. ౨. బ్రహ్మసూత్రరోమంథము. ౩. ప్రపత్తి చింత ౪. నృసింహశారీరకభాష్యము. ౫. ఉజ్వలానంద చంపువు. ౬. వాసవ పరాశరీయ నాటకము. ౭. జయసింహాశ్వమేధీయము. ౮. చిత్సూర్యాలోకము. ౯. కావ్యసూత్రవృత్తి—ఇత్యాదులు. వీరు సంస్కృతమున వ్రాసిన తత్త్వగ్రంథములసంఖ్య ౨౨. సాహిత్యగ్రంథములు ౧౪. స్తోత్రకృతులు ౧౫. నీతిశాస్త్రరచనలు ౨.

శ్రీమన్నరసింహాచార్యస్వామికి 'భగవత్కవి' యని బిరుదము. సింహాద్రినాథునియాచార్యుఁ డుపాసించుచుఁ దనకృతుల నన్నిటి నాతని కే యంకితముచేసెను. ముప్పదియేండ్ల యీడున నున్నపుడొకప్పుడు వేదవ్యాసులు వీరికిఁగలలోఁగనఁబడెనఁట. స్వప్నమునవచ్చిన దేవుఁడు తిక్కనాదుల నడిగినట్లు వీరిని కృతి యడుగలేదు. వచ్చి దర్శనమిచ్చి చక్కఁబోయెను. అప్పటినుండియే యీయనలో నార్షప్రతిభ రేకెత్తెను. విజయనగరములో నల్లచెఱువు మెట్టపై వేదవ్యాసులను కేశవస్వామిని ప్రతిష్ఠించి యీయాచార్యవరుఁ డాలయము నెలకొలిపెను. అట్టియుపాసకుఁ డీయన.

పదవయేంట సహజముగఁగవి తాధారయలవడినది. అచ్యుతపురాగ్ర హారములోఁ జిన్నతనమునాఁటి యొకవృత్తాంత మిట్లు చెప్పుదురు. అప్పన్నయను కుట్టుపనివాఁడు పట్టుగుడ్డతో నొకసంచికుట్టి యమ్మక మునకుఁ దెచ్చెను. ఈయాచార్యకవి బాలుఁడు దాని నాసించెను. కాని చేతఁ గానిలేదు. తత్క్షణమే యీపద్యము వానిపై నాశువుగఁజదివెను.

మునియాగరక్షకుండును
మునిపత్నీ రక్షకుండు మోదముతోడన్
నినుఁ గనుఁగొని ప్రోచుసుమీ
జరిజీ అప్పన్ననామ! సద్గుణధామా!

చదువుకొన్నకుఱ్ఱఁడని అప్పన్న సంతోషించి సంచి పట్టుకపొమ్మనెను. ప్రాసము పోయినదని యతఁ డెఱుఁగిన సంచి యీయకపోయి యుండువాఁడు.

క్రమముగా నరసింహాచార్యకవి పండితుల తలలూపించు కవిత్వము వ్రాయ మొదలిడెను. పఠనీయములగు సంస్కృతాంధ్రగ్రంథము లధిక రించెను. శాస్త్రపాండితిని సంపాదించెను. కంఠము మంచి దగుట సంగీత ముకూడ నేర్చెను.

వావిలివలస ప్రభుని దర్శించుట కొకప్పుడాచార్యులు పయనమైరి. ఆ దొరపేరు సీతారామయ్య. కవులనిన నా ప్రభువున కభిమానము. ఆయనను దర్శించి నరసింహాచార్యుఁ డీపద్యము చదివెను.

వెండికొండకు నీకీర్తి వెలిగలీబు
పాలకడలికి మీఁగడ పవికిఁ దళుకు
శశికిఁ దనకందుమాసుపఁ జాలుమందు
కొనఁ డదేలొకొ శ్రీరామకువలయేశ!

ఇదివిని రాజు రసికుఁడగుట నరసింహాచార్యుని తన యాస్థానకవిగ నుండ నడిగించెను. ఇతఁ డిది యంగీకరింపక యిట్లు చెప్పెను. "నేను కొంత కాలము క్రితము శ్రీవిజయనగరము మహారాజు విజయరామగజపతి వేటకై యడవి కేఁగుచు పాలకొండ గ్రామమున విడిసినపుడు

నేనాయన దర్శనము చేసియుంటిని. ఆ మహారాజు నాపద్యములు విని యానందించి విజయనగరము రమ్మని సెలవిచ్చెను. ఆయన యాజ్ఞచే మఱొకప్పుడు రాజధానికిఁ బోయి జమ్మి వాసుదేవరావుపంతులుగారి సాహాయ్యమున ఆనందగజపతికుమార రాజేంద్రుని సందర్శింపఁగలిగితిని. వారు నా కవితాధోరణి కానందపడి నన్నుఁ దమయొద్ద నుంచెదమనిరి. ఇంతలో మహారాజుగారు సకుటుంబముగాఁ గాశికిఁ బోవ నయ్యెను. నన్నును దమతో రమ్మని చెప్పిరి. కాని నేను వెళ్ళ వీలుగలుగలేదు. మేము తిరిగి వచ్చినతరువాత దర్శనము చేయుఁడని నాకుఁ జెప్పి వా రేఁగిరి. కావున నే నన్యాశ్రయము చేయఁజాలను."

నరసింహాచార్యునిమాటలు విని వావిలివలసప్రభువు అబ్బురపడెను. అప్పటి కీకవివయస్సు ఇరువది రెండేండ్లు మాత్రము. ౧౮౯౭ లో నీకవి తల్లితో దక్షిణదేశయాత్ర చేయుచు శ్రీరంగమునకు వచ్చి యచ్చటఁ గొంతకాల ముండెను. అపుడే "పీతభవత్కృష్ణ! రంగేశ వేమకృష్ణ" అను మకుటమున నొక శతకము రుక్మిణీకల్యాణ కథాత్మకముగ రచించెను. ఈశతకము వావిళ్ళవారును, చెలికాని లచ్చారావుగారు నుద్ధరించిశతక సంపుటములలోఁ బ్రకటించిరి. అందలి యొకపద్యము :

నీ కట్టివదలిన నెఱిక కన్నుల నద్ది
యుత్తరీయంబుగా నుంచుకొందు
నీ చుట్టివిడిచిన సిరుపము మాల్యముల్
ముదమంది కొప్పులో ముడిచికొందు
నీ మహాత్తరపాద నీరేజతీర్థంబు
చేఁద్రావి శిరమునఁ జిలికికొందు
నీ నోటికప్రంపు నెఱివిడె మిచ్చుచో
నమృతంబుగాఁ గేల నందుకొందు
నీదు పాదుక లొదలఁ బాదుకొల్పి
చెనఁటి జన్మంబు సఫలతఁ జేసికొందు
నయ్య దాస్య మొసంగఁగదయ్య నేఁడ
పీతభవత్కృష్ణ! రంగేశ వేమకృష్ణ!

శ్రీరంగమున నొకవత్సరముండి నరసింహాచార్యుఁడింటికి వచ్చెను. శ్రీవిజయనగర ప్రభువులును గాశినుండి వేంచేసిరి. మనకవి మరల మహారాజదర్శనముచేసెను. ఆనందగజపతియు వీరి కవిత్వగోష్ఠికలరి వీరిని మరిమరి ప్రేమించుచు వార్షిక బహుమానము నొసఁగుచుండెను. ఆనందగజపతి చెప్పుటచే మహారాజు విజయరామగజపతికిని నరసింహాచార్యుని కవిత్వపాండిత్యాదులపై విశ్వాసము కలిగినది. అప్పుడా మహారాజుపై మనకవివరుఁడిట్లు చెప్పెను.

ఈజగమందు నిందు నటులెల్లగఁ గనువిందొనర్చుమై
యోజ గనంగ రాజనుట కుల్లము సందియ మొంద దిందునన్
రాజను మాట మావిజయరామనరేంద్రునకే పొసంగు పై
రాజులు శోకవహ్ని మదిరాఁజుట రాజులనంగఁ జెల్లెడిన్.

ధక్కా ఢఢాంకరణ రవ
ఫక్కత్ఫణిప ఫణామణి నిపతనజ శూల
స్ఫుర్కర్ణకుహర ఘుర్ఘుర
ముక్కోలపభీత గుప్తముఖ కూర్మేంద్రా !

ఈ పద్యములు విని విజయరామరాజు చాలసంతోషించి నరసింహాచార్యుని తనసంస్థానకవిగ నాదరించెను. భర్తృహరి మున్నగుకృతులు మహారాజే పండితునికడఁ బఠించెను.

కూరెళ్ళ రామశాస్త్రి యను పండితులొకరు "ఉమాముఖం చుంబతి వాసుదేవః" అనుసమస్యనిచ్చి పూరింపుఁడని నరసింహాచార్యుల నడిగినపుడాయన తడవుకొనకుండ

భవిష్యదీశోపయమం విచింత్య
హిమాలయస్యాలయమేత్య కిం తే
సుతేతి చోద్ధృత్య శిశుత్వముగ్ధ
ముమాముఖం చుంబతి వాసుదేవః.

అని చదివెను. ఆశువున నింత యందముగఁ జెప్పుట యబ్బురము. సంస్కృతాంధ్రములు రెండింటను వీరికవిత ప్రౌఢతరము. తెలుఁగున వీరు వ్రాసినవి తక్కువగ నున్నవి.

ఈసమస్యాపూరణ మెంత రమణీయముగ నున్నదో యరయవచ్చును.

> స్నిగ్ధత దేవదానవులు చెచ్చెర మందర భూధరంబుఁ న్
> ముగ్ధత వాసుకి న్బ్రదివి మోము మథింప హాలాహలంబు ని
> ర్దగ్ధము సేయ నద్రిశిఖరంబులు విచ్చి శరణ్యుఁ డుండియున్
> దుగ్ధపయోధిమధ్యమున దున్నది గన్మొనదేమి చిత్రమో!

కవికల్పద్రుమ మనందగు నానందగజపతి ౧౮౯౭ లోఁ బరమపద మందెను. ఆయనగతించిన వెనుక నరసింహాచార్యుని కలమాఁగిపోయినది. ఇఁక విరక్తినంది భగవదుపాసనముఁ గడపుచు నీభగవత్కృపయెనుబది యేండ్లుజీవించి ౧౯౨౭ లో జీవయాత్రచాలించెను. కూచిమంచి తిమ్మకవివలె నరసింహాచార్యులును నలుగురు ప్రభువులకాలమున నుండె ననుట యొక విశేషము.

ఈకవి తెనుఁగుకృతులలోఁ గొన్ని చాటువులు, రంగేశ శతకమును శాశ్వతముగ నుండఁగలవు. సంస్కృతాంధ్రములలో వీరి కవిత్వపు మచ్చులు మఱిరెండు.

నఖస్తవము :

> రాగోయం మధురాధరే క్షిపతి మాం సింహాచలాధీశ తే
> జ్ఞానం త్వత్పదపద్మ శుభ్రనఖరజ్యోత్స్నా మధః కర్షతి
> భో సింహాచలనాథ పాహిలులితం ద్వేధాశ్రమాపాదనా
> ద్యత్రావాస్థితి రస్యతత్ర వసతిం దేహి ప్రభోమావిరమ్.

పౌఢాశృంగారము :

> తరుణి! నీదు కాంతిఝరి కన్నులను గ్రోలి
> పొరలవలసెఁ దాపగరిమ విరుల
> చెండులంతలేసి కొండలచే నెంత
> జోబ గలిగె నింత సుందరాంగి.

# కొక్కొండ వేంకటరత్న శర్మ

## 1842-1915

నియోగిశాఖీయులు. జన్మస్థానము వినుకొండ. నివాసము చెన్నపట్టణము. రాజమహేంద్రవరము. జననము 14-3-1842 సం॥ నిర్యాణము 1915. కవికర్తృకకృతులు: పంచతంత్రము, సింహాచల యాత్ర, బిల్వేశ్వరశతకము, బిల్వేశ్వరీయ ప్రబంధము, కుమారనృసింహము, ధనంజయవిజయ వ్యాయోగము, నరకాసుర విజయ వ్యాయోగము, మంగళగిరి మాహాత్మ్యము, కొరుకొండ మాహాత్మ్యము, గోదావరీ వర్ణనము, గోవిందమంజరి, దీక్షితచరిత్రము, యువరాజ పర్యటనము, పోయం ఆఫ్ ది ప్రిన్స్ ఆఫ్ వేల్సు-విజిట్ టు ఇండియా- ఇత్యాదులు.

వేంకటరత్నశర్మగారు 'మహామహోపాధ్యాయ' లని కొనియాడఁబడిన పండితులు. చిత్తూరు మండలములోని 'తిరువల' గ్రామమున వెలసిన శ్రీ తనుమధ్యా బిల్వ నాథేశ్వరులభక్తులు వీరు. తత్కరుణా కటాక్ష సంప్రాప్త కవితావిద్యా ప్రవీణులు. గుంటూరిలో విద్యాభ్యాసముచేసిరి. చెన్నపురి రాష్ట్రీయకళాశాలలోఁబండితపద మధిష్ఠించిరి. రాజమహేంద్రవర రాజకీయ శాస్త్రకళాశాలయందుఁ బ్రధానాంధ్రపండితులై ముప్పదియేండ్లుద్యోగించిరి. కవిబ్రహ్మయనియు, అక్షరసంఖ్యాచార్యులనియు వీరి బిరుదములు. మహామహోపాధ్యాయ మహాబిరుదమందిన తెలుఁగువారిలో వీరు తొలివారు. "ఆంధ్ర భాషాసంజీవిని" వీరు నడపిన తెలుఁగు పత్రిక. ప్రసిద్ధిగాంచిన నాఁటి పత్రికలలో నిది యొకటి. అముద్రిత గ్రంథచింతామణి-కళావతి-వివేకవర్ధని శశిలేఖ మున్నగుపత్రికలు మహోన్నమ రచయితల సంపాదకత్వమున వెలువడుచుండిన దివసములవి. నాఁడు 'ఆంధ్రభాషా సంజీవిని' యన్వర్థనామముతో వెలసినది. వేంకటరత్నముపంతులు గారికి ధర్మవరము రామకృష్ణమాచార్యులు, రాయదుర్గము నరసయ్య

శాస్త్రి, కొమాండూరి అనంతాచార్యులు మున్నగు పండితకవుల చెలిమి చేకూరినది. ఈయన "ఆంధ్ర ప్రసన్న రాఘవము"ను వేదము వేంకటరాయశాస్త్రి యాఁకకు నీఁకగా విమర్శించెను. నాటివిమర్శనములు కొన్ని స్మరణయోగ్యములు కావు. అందు తిట్టులు శాపములు కుప్పనఁగూరలు. విమర్శనమున సారము లేకపోలేదు. కాని వ్యక్తి దూషణములు పెచ్చుపెరిఁగినవి. కొక్కొండపండితుని ప్రసన్న రాఘవమును గూర్చి వేంకటరాయశాస్త్రిగా రిట్లనుచున్నారు.

"ఛందోవ్యాకరణాలంకారముల కిది వేరుపురువు ... రసము సున్న ... పూర్వులు చెప్పినపాకము లిందు లేవు ...... కపనము పెద్ద యక్షరములవ్రాఁత కుదురకముందే వ్రాసిన జిలుఁగుగొలుసు ఎట్లుండునో అట్లున్నది. పాదపూరణమువలన పద్యార్థము ప్రాయికముగా నభేద్యత్వముంబొరసియుండును. పాదపూరణప్రయోగమందును, అది యేని చక్కఁగ చేతగామియుండును ఇంతటికవి మఱిలేఁడు. అలంకార శాస్త్రమునఁ జెప్పినదోషములలో నిందు లేనిది లేదు అందులేనివి యింఁదెన్నియేని గలవు. తప్పుయతులు తప్పుగణములు తప్పుసంధులు ఆద్యంత సమాసములు పరసవస్తుత్యాగము కొసఁసరులు అంత్యాశ్చర్యములు సముచ్చయములు పౌనరుక్త్యము, ఉక్తానుక్తకావ్యదోషములు ఇత్యాద్యపాయము లెన్ని యేని యుండియు వీరిపద్యమున కుదురక పడినపాట్లు అనుశోచనీయముగా నున్నవి..."

ఈ వచనములు నాఁటి విమర్శనలతీరు లిటులుండె ననుటకుఁజూపఁబడినవి. ఈకవివరున కిట్లేపెక్కుమందితో వాగ్వివాదములువచ్చినవి. మండపాక పార్వతీశ్వరశాస్త్రిగా రిట్లువ్రాసిరి.

పటుధాటీ పరిపాటియందుఁ గవితా ప్రాగల్భ్యమం దింక న
న్నిటియం దెన్నికఁగన్న చెన్నపురిలో నెక్కొన్న కొక్కొండ వేం
కటరత్నాఖ్య కవీశ్వరుండు పరసగ్రంథంబు లచ్చొత్తుచున్
గటువాదం బిటుమీఁదనైన విడువంగా నర్థిఁబ్రార్థించెదన్.

పూండ్ల రామకృష్ణయ్య పండితుఁడు వేంకటరత్నముపండితులుగారి బిల్హేశ్వరీయాది కృతులు విమర్శించిప్రచురించెను. ఆయా విషయములకు సముద్రిత గ్రంథచింతామణి యనయనగును వేంకటరత్నకవి కవిత సంస్కృతసమాస నిబిడము. ఈయనకు సంస్కృతభాషా పాండిత్యము తక్కువయనియుఁ దెలుఁగున గట్టిశక్తి కలదనియు విమర్శకు లనిరి. అది మనము సహింపరాని మాట. వీరు వెండి, బంగారము మున్నగు క్రొత్తరకపు వృత్తములు కల్పించి తమ ప్రబంధములలోఁ జేర్చిరి.

సీ. చిటిపొటి కొంపలు చిన్నవి పెద్దవి
యిండ్లు మిద్దెలు దారి కిరుగెలఁకుల
నారు పోసినయట్లు వారక యెన్నని
పూర్వాచరణముల పోల్కిఁదనర
మరికొన్ని సుగృహహర్మ్యములు నూత్నాచార
ములయట్లు పైపయి మురువుసూపఁ
జైత్యద్రుమంబుచే సత్రంబులుగ వార
మున కొకసంతయె యొనర విపణి
గా నధిత్యకనృహరి నికాయమె ఘన
రాజమందిరముగఁ గను రాజిలంగ
జానపద జన సమాజమెద్దైనఁ బౌర
కోవిదావాసము నగుఁ గోర్కొండపురము.

'కుమార నృసింహము.'

వీరేశలింగముపంతులుగారును వీరును పరస్పర గ్రంథవిమర్శనములు గావించుకొనిరి. ఆ గ్రంథవిమర్శనములు క్రమముగా వ్యక్తిదూషణము లకుఁజేరి విసుగుపుట్టించినవి. అయినను భాషాజిజ్ఞాసువుల కా విమర్శన ములు కొంత యుపయోగపడిన వనవచ్చును. వేంకటరత్నముపంతులు గారు 'ఆంధ్రభాషాసంజీవిని' పత్రిక కనుబంధముగా హాస్యసంజీవిని

ప్రకటించిరి. వీరేశలింగముపంతులుగారును 'వివేకవర్ధని' ప్రక్క హాస్యవర్ధని వెలువరించిరి. ఇవి యన్యోన్యవివాదములతోఁ జాలకాలము చెలరేఁగినవి. ప్రసిద్ధపండితుఁ డన్నవాఁ డల్ల వేంకటరత్నముపంతులుగారి గ్రంథములు విమర్శించెను. దీనికిఁ గారణము; ఆయన సంస్కృతాంధ్రములం దసమానపండితుండై మహామహోపాధ్యాయుఁడను నగ్గలపు బిరుద మాం నాఁ డాంధ్రులలో నందుకొనుటయే యనవలయును.

'పలుకు దయ్యాగూ, ఇది పాయసమమ్మా! బమ్మదయ్యాపుటిల్లాలా! ఇది పానకమమ్మా! త్రాగుమమ్మా!' అను రీతిని మాటాడు గ్రాంథిక భాషాస్వరూపుఁ డీయన. ఇంటిలో భార్యకడను, బజారులో దుకాణము కడను వీరు గ్రాంథికసంభాషణము గావించెడివారు. అంత పట్టుదల. అఱవము, కన్నడము నెఱుఁగుదురు. వీరురచించిన బిల్వేశ్వరీయమున కఱవమున మాతృక యున్నదఁట. 'గీతమహానటము' అను పేరితో జయదేవుని గీతగోవిందమువంటి కృతిని వీరు సంస్కృతమున నంతరించిరి. విద్యావినోదము వనప్పాకము అనంతాచార్యులుగారు పంతులుగారిని "ఆంధ్రా జాన్సన్" అని పిలుచుచుండువారు. ఇట్టికవి తెలుఁగువారికి సదా స్మరణీయుఁడుగదా !

